


# వేశ్యా విలాపము.

చ॥ ధనముగలాని నిర్ధనుని, ధైర్యగుణాఢ్యుని దర్పహీనునిన్
వినుతయశోభిరాము నవినీతుని, రూపసినిన్ గురూపినిన్
గనుగొనునొక్కరీతిగ ననారతమెవ్వఁ, డట్టిండె వేశ్యలన్
మనిచెపుగాత! యింకనయినన్ వ్యభిచారము మాన్పి
ధాత్రిపై॥

ఉ॥ చీటికిమాటికిన్ బడఁపుఁ జేడియ వృత్తములెల్ల నెల్లెడన్
జాటఁదలంతురెల్లరిది న్యాయమె యానను కొందు; కాని,మా
కేటికినింత యేని గ్రహియింపఁగఁ జాలరొకప్పుడేని మా
లోటును; దప్పులించుకఁ గలుంగనివారు జగానఁగల్గిరే॥

చ॥ కులసతులన్ ద్యజించి, వెలకోమలులన్ వరియించి, తాతతం
డ్రులుగడియించినట్టి ధనమున్ దృణమట్టుల నీసడింపఁగాఁ
దలచుటమీకుఁ జెల్లునె? విధాతలిఖించిన వ్రాలు చొప్పునన్
వలపులఁజూపి కొల్లగ ధనంబు గడించుట మాకుఁ జెల్లదే॥

శా॥ ఇంటన్ బంగరుబొమ్మలోయనఁగ నెంతేయొప్పు కాంతా
మణుల్
కంటన్ దోసెడినీళ్ళ కేడ్వఁ, బురుషుల్ పల్మారు వేశ్యాళివె
న్వెంటన్ ద్రిమ్మరి పైఁబయిన్ బహుట నెమ్మొప్పే కాని, యాచా
రమై
యింటన్ బుట్టిన వృత్తిఁ జేకొనుట మాదే తప్పుగాఁదోఁచెనా॥

మ॥ ఉరులన్ బన్ని మృగాదులన్ బడయు టెట్లో, యట్టి చందాన, మా
తరుణుల్ మెల్లనఁ జూపులన్ విటులమీఁదన్ గప్పి, పుష్పా
స్త్రసం
గరరంగంబునకీడ్చి యర్థము గ్రహింపన్ జూచుటే సత్య మీ
యువుల్ నిక్కుటఁ దప్పమీయదియు కాదో ? సుంత యో
జింపుఁడీ॥

మ॥ హితులన్ గూడి సశిథమా నెలవు లెంతేఁ జొచ్చి తారాడఁగాఁ
గత మేమిటా ? యటమీఁద మా ముదుసలుల్ కాదంచు వా
దించినన్
బ్రతిమాలన్ బనియేమి? యా వెనుక నర్థం బెల్లఁ బోనాడి దు
స్థితికిన్ వచ్చినదాఁడి వేశ్యలను నిందింపన్ బనేమీ? విటుల్॥

చ॥ వలదనితో ల్గఁ జెప్పినను "వారవిలాసినివీవ కావ ? రా
కలువలదా"? యటంచు నధికంబుగ మమ్ము విటుల్ హసిం
పఁగాఁ
దల మటు, విత్తమంతయు యథావిధిగా హరియించి పిమ్మటన్
వెలుపలికీడ్చినన్ బలుక నేరక పోవుట మీకుఁ జెల్లునే॥

మ॥ కనుబొమ్మల్ నిగుడించి మావదనమున్ గన్గొంట యేల తప్పు, కాం
చిన యామీఁదను బోక మా సదనమున్ వేఁ జొచ్చుటే తప్పు, సొ
చ్చిన వెన్కన్ దలనున్నగానొరిగి వేసిందాక మా వారి కాం
తను జేపట్టుటె తప్పు ; తప్పగిలదా ! మా పైనిసుం తేనియున్॥

చ॥ పది పదిరెండు వర్షముల ప్రాయము నేరకమున్న రాకలన్
బదిలము సేసి వేశ్యలకునై తిరుగాడుచునుండఁ బూరుషుల్
సదయదయాంతరంగులయి సానులు కూడదటంచుఁ జెప్పఁగా
నెదఁదలపోతురే ? తలచెనేని లభించున మాకు సంపదల్॥

ఉ॥ ఎత్తునకెత్తుగా ధనమునిచ్చిన నొక్కనిపొత్తునుంటకున్
బొత్తిగ సమ్మతింగొనరుపో! గణికాంగనలందు రీతిమా
వృత్తియ కాదె? యౌవనమువీడిన వెన్క మమున్ వరింపఁగా
వత్తురె జారపూరుషులు; వచ్చినవిత్తము నీయనెంతురే॥

మ॥ ఎవరేయే యగచాట్లపాలయిన దాసీవెన్క, నుంతేని జా
లివడన్ గారణమింతకల్గదుసుమండీ! వేశ్యకేమన్న, మా
జవరాండ్రాదిని రూకలన్ గొనక యే సౌఖ్యంబుఁ జేకూర్తుమం
చువిటుల్ బల్మరుకోరిపిల్చి ధనహీనుల్ జేసిరే యూపయిన్॥

చ॥ కలువలజేని సోయగముఁ గాదనిపించెడి వానినైన మా
వెలచెలులర్థముల్ గొనక వెంగలులై మరికేళిఁ జేల్పఁగాఁ
దలపరు, రూపహీనుఁడు తదర్థమొసంగిన వాని నేస్తముల్
వలదనఁబోరు; మాకివి ధ్రువంబగు పద్ధతులంచెఱుంగరే॥

మ॥ ఒకదుండన్ మరియొక్కనిన్ బిలిచి, వేఱొక్కండు రా
జేసి, లో
నొకనైపై పైకిమరొక్కనైపై నటనసేయున్ గాని, నిక్కంపుఁబ్రే
మకుఁ జోటియ్యదు వేశ్యకాంతయనుచున్ మమ్మాడఁగా
నేల? మే
మొకనాడేని మహాపతివ్రతలమో హాహాయయ్యమ వాకొం
చెమే॥

ఉ॥ చేతికొలంది విత్తమును జేర్చుకొలందినిఁ బీల్చిపిప్పిగాఁ
జేతురెకాని కాముకులఁ, జీ! వలదందురె వేశ్యభామినుల్
మూతిబిగించిమీరలెమమున్ ద్యజియించుటఁబాడిగాని, మా
జాతికినీతిఁజెప్పినఁ బొసంగునె? నైజముమాన్ప నేర్తురే॥

ఉ॥ పెద్దలుసేర్చి మాకిడిన విత్తము సంచుక నిల్వనీక, మా
ముద్దియ లేదికోరిన నమోఘముగా సమకూర్చుచుండఁగా
వద్దనుటెట్లు? దేహము రవంతయు నొవ్వక మీకు నూరకే
యొద్దకుఁ జేరియున్న ధనమొప్పుగ భద్రము సేయ నెంతురే॥

ఉ॥ నిక్కముగా వచించినను నిష్ఠుర మేయగుఁగాక మాపయిన్
మక్కువఁ జూపనేల? నసమాన సుఖంబుల నందనేల? మీ
బొక్కసమంతయున్ దఱిఁగిపో మముఁ దిట్టఁగనేల? నూరకే
యక్కఱఁ దీర్చువారె, వెలయాంగన లంతటి వెఱ్ఱివారలే॥

ఉ॥ పున్నమనాటి చంద్రునిఁ బోలిన మా వదనంబు గాంచి ము
న్నెన్న డెఱుంగినట్టులె రతీశుని జ్వాలల కింధనంబులై
మున్ను గడించినట్టి ధనమున్ దుదముట్టఁగ వెచ్చబెట్టి మ
మ్మన్నను లాభమింత కలదా? గణికాంగన లింత చుల్కనా॥

చ॥ పురుషులఁ బిల్చి విత్తమును బూర్ణముగా హరియించి, యాలిసో
దరసుత బంధుకోటి కహితమ్మొనరించుట మాకుఁ ధర్మ, మీ
రెఱుఁగక నివిధంబును యథేచ్ఛగ సానుల యిండ్ల రేబవల్
తిరుగుట తప్పుగాక! మము దెప్పిన నేమి ప్రయోజనంబిలన్॥

మ॥ వినుఁడీ! దాపఁగనేల? మాతనువులుర్విన్ మేడిపండన్న రీ
తిని, లోఁ బుచ్చునుఁ బై మెఱుంగునగు టెంతే సత్య, మిద్దానిఁ గాం
చినమాత్రాన భ్రమించి రేమగనికిన్ దీక్షైన మీ దేహకాం
తిని నిర్మూల మొనర్ప నేల? నటుపై నిందింప నేలా? మమున్॥

మ॥ మునురంభాదులు మౌనికోటుల తపంబుల్ కొల్లగొన్నట్టులే
ధనగర్వంబున విఱ్ఱవీగు నరులన్ దార్మ్యాకుగావించి, మే

మునునీనాఁడు కులాభిమానమున నేర్పున జూపిసన్నానుగో
యనఁగాజారులఁ ద్రిప్పుచుంటిమివి కావా ? మాకులాచా
రముల్॥

చ॥ అతులితమైన సద్వ్యశమునంతయు బూడిదెపాలు చేసి, మా
సతులొనరించు దుష్కపట సౌఖ్యపయోనిధి నీదులాడి,యం
చితగుణరూపయౌవనవిశేషములన్ వ్యథగానొనర్పుఁడీ
క్షితిపయివంచు జారులకుఁ జెప్పిరె వేశ్యకులాంగనామణుల్॥

ఉ॥ మెత్తని పాన్పుపైఁ దనువు మెల్లనఁ జేర్పఁగనిచ్చి, గుబ్బలన్
హత్తుకొనంగనిచ్చి, యధరామృతమల్ల ననానసనిచ్చి మా
పొత్తునొసంగినందులకు భోగులజోగులఁ జేయ కేలపో
నిత్తుము ; పిమ్మటన్ బలుకనెంతువె పిల్చినఁగాని చెప్పుఁడీ॥

చ॥ మదనుని బారికిన్ బడి, యమాయకులై మముఁ జేరి, సర్వసం
పతలను గోలుపొమ్మనుచు మా వెలయాండ్రు వచించినారె? త
ప్పిదమును మీరు చేసి, పయి పిచ్చుమమున్ గపటాత్మలంచు నె
ల్లిదమొనరింప నేటికి; కటు లేయయినన్ మముడాయ నేటికిన్॥

ఉ॥ ఇచ్చిన నర్థమున్ బలుకనెంచెద, రీయక యున్న సుంతయున్
మచ్చిక సేయనొల్ల, రిది మా వెలయాలుల లక్షణంబగున్
నచ్చియొనచ్చకో తొలుతనా కొను లర్పణ సేసి మాకు, మీ
యిచ్చకొలంది యావెనుక నేటికి దూరెదరో? వచింపుఁడీ॥

ఉ॥ మందులు వెట్టి పూరుషులమానసముల్ హరియింతురంచుమ
మ్మందురు కొంతమంది, కుసుమాస్త్రుని దాడికి నోర్వలేక మా
సందిటఁ జేరువారిని విషాదము వాపి రమింపఁ జేయుటే
మందగుఁ గాక! యింకఁ బెరమందులతోఁ బని యేమి వేశ్యకున్॥

ఉ॥ చెంతకుఁ జేరి, మన్మథవిచేష్టలకున్ దలయూపుపట్టుసన్
సంతసమంది, కాంచనధనంబుఁ దనంతటఁ దానయిచ్చి, యు
ర్థాంతమునందు వేశ్యవలనన్ జెడిపోతిననంగనేల ? మే
మింతకుమాగృహంబునకు నిచ్చిమిమున్ గొనివచ్చినారమే॥

ఉ॥ ఒక్కనివెంటనొక్కనికి నొప్పఁగఁ బూసిదఁ బూతురంచు మ
మ్మెక్కటి! మేలమాడఁ దగునా? వెలయాలికిమిక్కుటంబుగా
జిక్కఁడిసే వేళఁ గొక్కము, నసీ వలదందురె? యింతయేల, మా
దిక్కుకు రానిచో మిముఁ దుదిన్ మరవస్థలపాలుసేతుమే॥

చ॥ ధనమునకాసఁ జెందియొకదా ! తలపోయక నెంతవానినై
ననుదరిఁ జేర్చి, కాసుకయినన్ గతిలేదనిపించి, పిమ్మటా
తని బడఁబట్టి నెట్టెద, మధర్మమున బనియేమి ?' వేశ్యకున్
వనజభవుండు మోముపయి వ్రాసిన ధర్మము లిట్టివేకదా! ॥

ఉ॥ కొంపలనమ్మి, యొల్లరిదికూడదటన్నను నింతయేనిలె
క్కింపక, దప్పుడీగతిఁ బకీరయినాఁడని రెండుచేతులన్
జెంపలు వేసికోక, వెలచేడియపొట్టనుఁ బెట్టితంచుఁ జిం
తింపఁగనేలఁ? దొల్లిమిముఁ దెచ్చి యొసంగుడటంచుఁ గొట్టిరే॥

శా॥ నీచుండైనను ద్రవ్యమేయొసఁగునేనిన్ గొప్పగాఁ జూచుటల్
నీచత్వంబునఁ జూచుటర్థమిడఁడేనిన్ గొప్పవాడైనన్, సదా
యాచారంబగుమాకు వేశ్యలకు; నియ్యర్థంబుఁ బాటించి, మీ
రే, ఛీ ! యంచుఁ ద్యజింపఁగావలయుఁగానీ ! మమ్ము,
మా కేటికిన్॥

ఉ॥ కాముకులై, యథేచ్ఛగ జగంబునఁ ద్రిమ్మరువారినెల్లరిన్
గాముని కేళికిన్ బిలిచి గర్వముసర్వముఁ గొంగఁజేసి, మా

సామజయాన లంచితయశంబుగఁ గణింతురె కాని; వారికాం
తామణులన్నఁ జీయనెడి ధన్యులఁ జిక్కులు వెట్టనేర్తురే॥

ఉ॥ మేళములాడునప్డు భ్రమియింపఁగఁ జేయు మిటారిచూపులన్
గాలము వైచి తెనాటుకొనఁగా మగవారలమీఁదికంపి, వే
శ్యాలలనాస్మదీయులు వశంబగువారలఁ బాడుసేయఁగాఁ
జాలుదు; రన్యపూరుషులసంపదలన్ హరియింపనేర్తురే॥

మ॥ పడుపుంగత్తెకు మోహమొకప్పుడును జూపంబోని శ్రీమంతులే
యెడనున్నన్ గడుమాయదారులగుమా వృద్ధాంగనల్ లేనిపో
కడలన్ బన్ని త్వదీయమానసము బిగ్గన్ బట్టి మాయింటని
ల్కడగా దాసునిఁజేసి నిల్పెదరు, లెక్కా! మాకు నికా
ర్యముల్॥

ఉ॥ పెద్ద లెఱింగిపోషరను భీతియొకించుక గానిలేక, యే
ప్రొద్దును మా దువారముల ముంగిటఁ ద్రిమ్మరువారి నెల్ల మా
ముద్దియ లర్థమంతయు సమూలముగా హరియించియా పయిన్
రద్దియొనర్చి పంపరె, మనంబున నూరక పంపనెంతురే॥

శా॥ వాలుంగన్నుల లోకింత త్రిప్పినను మా వారాంగనల్ దాటిపో
నేలా మా చెదరెంతవారయినఁ బైనేమైనఁగానీ! మముల్
గేహీమందిరమందుఁ దారసిలి శక్తిన్ మించు రొక్కంబు మా
కేలన్ బెట్టక, దాఁగొట్టులన మాకేఁ జెల్లు సంకేతికిన్॥

శా॥ చోరుం డేహరియించినన్ దుదకు నిల్చుం గాని కొంతైన, వే
శ్యారామాంగి హరింపనెంచినను, దివ్యంబైన సౌధంబులున్
హారంబుల్ మరి వాహనంబులును మాన్యక్షేత్రముల్ గాక, మీ
యూతున్ బేరును గూడ నాశనము సేయున్ నిర్దయాస్వాంతయై।

మ॥ ధనమున్నంతకు వేశ్యలన్ విటులు, నార్ద్రవ్యంబుఁగాఁ జేయుదా
కటు వేశ్యాంగనలా విటాళి విడువంగా నోప, రావెన్కమా
కును హీనంబగు మిమ్ముఁ జూడఁ, దలచిక్కున్ వీడినట్లుండు మీ
కును మమ్మున్ గనినంత; నియ్యవి యెమీకున్ మాకు సంబం
ధముల్॥

శా॥ దారాపుత్రకు లేడ్చుచుండగఁ, బితల్ దౌర్భాగ్యుఁడీ పుత్రుడం
చారాటంబునఁ జేసి శోకమునఁ గ్రుంగన్, బాధువుల్ కూడదీ
నేరంపున్ బనులంచుఁ జెప్ప, హితులున్ హీనంబుగా జూడ, మీ
రీరీతిన్ జెడి మాకు మీకు నపకీర్తిన్ దెచ్చుటల్ మానుఁడీ॥

ఉ॥ ధీరచరిత్రులార! మముఁ దిట్టక యింతట[illegible]న మీరు మా
దారికి రాకయుండినఁ, బదంపడి కూటికి మా[illegible]వాచి, మా
వారలు గూడ మీవలె వివాహితులై యిక మీదనైన సం
సారులె యౌదురు; రా వెనుక మాకును మీకును మేలె యయ్యె
డిన్॥

చ॥ విటులను బట్టి వేశ్యలును, వేశ్యలఁ బట్టి విటుల్ ధరిత్రి మి
క్కుటమగు నిందపాలగుటకున్ గతమయ్యెనటంచు గాక, నే
నిటు వెలయాలులన్ విటుల నెంతయు నిందయొనర్పనిందు; న
క్కటికముఁ బూని యొప్పులను గైకొని తప్పులు వీడుడెల్లరున్॥

సమాప్తము.



